శ్రీ రస్తు.

# సైంధవ పరాభవ నాటకము



ఇది

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా నాగులవరం శివార్ల
బెల్లంకొండ వారిపాలెం గ్రామ నివా[illegible]
న్వయ సుధాసాగర రాకాసుధాకరులు నగు,

బ్రహ్మశ్రీ॥ సీతిరాజ సీతారామచంద్ర యామాత్య
సోదర కవులచే రచియింపంబడి

ఏతద్గ్రామ నివాసులును శ్రీరామచంద్ర చరణారవింద
భక్తియుక్తులును, పెద కమ్మవారు నైన,

నట్టికొండ జానకిరామయ్య, యీ వెంకయ్య,
యీ జయరామయ్య గార్ల
ద్రవ్య సహాయము చే

బెజవాడ వాణీ ముద్రాక్షరశాల యందు
ముద్రింపబడియె.

1925.



శ్రీరాములు

# సైంధవ పరాభవనాటకము.

## శ్రీసీతారామ స్తవము

శా॥ శ్రీరాజద్ఘనలక్ష్మణాద్యనుజులన్ • శ్రేష్ఠాంబు వైదేహినిన్।
ధీరత్వంబున గూడి రత్నవిలస • త్సింహాసనాసీనుడై।
ధారాళంబుగ నొల్వదీన నృపుల్ • త్రాణస్థం గ్రహాధీశజా।
ధారుణ్ బెల్లముకొండవారిపురి సీ • తారాముని న్గొల్చెదన్॥

(కథా ప్రారంభము)

## ద్రౌపది రాకడ—దర్వు

విచ్చేసె బాంచాలియూ, తన. నెచ్చెలి వెంబడి. చెచ్చెరనడువాగ ॥విచ్చే॥ మల్లెమొగ్గలచీరగట్టి, నుదుట, నల్లానికస్తూరి, నల్లానదిద్దియు ॥విచ్చే॥ ఉంగ్గాలుదీర్చియునూ, రవికె, నిగ్గాగదాల్చియు, దిగ్గానబాగూగ ॥విచ్చే॥ బంగారు సొమ్ములుతా, నొప్ప నింగీతమొప్పార హంగూగ ధరియించి ॥విచ్చే॥ జానాకిరామయ్యనూ, బ్రోచు, జానకిరాముని, మానూగదలచుచు ॥విచ్చే॥

## మండూక శబ్దము.

తక్కుఢింకుకు, ఝుకురుఝుంతరి - చక్కగాను దంతీంద్రుడొక్కడు చిక్కిమకరికి చిక్కులంబడి - సొక్కి మైకడు స్రుక్కి నీవే దిక్కుగావుమటం చుదానలు-దిక్కులంబరికింపుచుండగ రక్కసులమది నుక్కుదక్కగ - వెక్కసంబున జేయుచక్రము పిక్కటిల్లగ బంపి మొసలిని - బెక్కుచెక్కలు జెక్కికరికిని మక్కువొప్పగ మోక్షమిచ్చియు - నిక్కవంబుగ వేంకయార్యుని గ్రక్కునం బోషించి సీతా- రామచంద్రాకవులమనముల నక్కటిక

మొప్పారవెలసిన-పక్షి-రాయని నెక్కు-జోదునే మ్రొక్కు-వేతు తక్కి-టక్కి-టతకతకిటతక తకదధింగిణతోం॥

చెలికత్తెయగు ధాత్రికవాక్యము

కం॥ అమ్మా నీవృత్తాంతము నిమ్మళముగ నాకుఁగ జెప్పు • నీరజపాణీ।
నమ్మతితో తెరవెడలియు నెమ్మనమున దాచనేల • నీవిక బాలా॥

ద్రౌపది-ద్విపద॥ అనయాజ్ఞసేనియు • నతిదీనవాక్కు-లను జెలికత్తెతో • లలినియిట్లనియె। పాంచాల దేశాధి • పతివరసుతను। పంచపాండవులు మ • త్ప్రాణవల్లభులు। పాంచాలిపేరుచే • బరగెడుదాన। నంచితంబుగ రాజ్య • మంత్రముగరులు। నుష్ట్రిముల్హయములు • నొప్పుగానుధృత। రాష్ట్రిసర్వంసహా • రాజాత్మజులకు। మాయజూదంబున మఱియుగోల్పోవ। బాయకపామరు • ల్వాద్ధివోత్తములు। గోష్టిలోపల నాదు • కోకలువిడచి। కష్టబెట్టగభూరి • కానలనార। చీరలుగట్టియు శ్రీహరీయనుచు। భూరుహంబులనీడ • పొందుగానిలచి। కాలంబుగొన్నాళ్లు • గడపిసత్పర్ణ।శాలనిర్మించివి • శాలంబుగాను। శ్రేయంబుగాబ్రవే • శించినాకలికి। గాయకూరలుమెక్కి • కాయంబులెండి।యున్నారమీరీతి• నుత్పలనేత్ర।పన్నుగావింటివే • పరగనాకథను॥

ధాత్రిక=కం॥ ఆకలికాకులుమెక్కు-చు। నాకులమునదస్నిమాట• లాడగలేక। వీకచెడియున్నదానవు। శోకగగూర్చుండుమమ్మ • సోమసమాస్యా॥

ధర్మరాజు రావడం=దరువు

ధర్మజుడేతెంచెనూ -జనులారా -కర్మమునకిఱుంచెనూ-ధర్మకిరీటము - ప్రబలభుజకీర్తులు నిర్మలకాంతులు, నెగడాగధరియించి ॥ధర్మజు॥

తమ్ములనొగిగూడుకా - చేబూని - యమ్ములువిలు వేడుకా సమ్మతివెనువెంట, చాగులునడువాగ -నిమ్మళంబుగ వేడ్క - నెమ్మనమ్మునబొడమ ॥ధర్మజు॥

ఆకాలిబాధాకోర్వాకా - మృగముల - జోకాగదరిమిబోనీకా భీకారాటవులందు - వేటాలాడియుబొలసు పీకాదెత్తూమని - వెలదీకి తాదెల్పా ॥ధర్మజు॥

జానకిరామయ్యనూ బహుభోగను జ్ఞానూఢ్యై విలసిల్లానూ రాణ జేసి సీతా, రామచంద్రార్యాల మానూగ్రోచిన, .మహీజేశు నెన్నూచు ॥ధర్మాజు॥

ద్రౌపది=కం॥ దండంబుపాండునందన దండంబుయశోభిరామ, దండమునాథా దండమున్నృపవేదండా దండముదండంబు, దండ • ధరవర తనయా॥ ధర్మరాజు=కం॥ వర్ధిల్లవె పాంచాలీ వర్ధిల్లవె సారసాక్షి, • వర్ధిల్లుసతీ వర్ధిల్లుసుందరాంగీ వర్ధిల్లవె కంబుకంఠి • వర్ధిలుతరుణీ॥

వ॥ ఓద్రుపదపుత్రీ, మనమ్మన ఘనమగు వేడుకబూడమెగానసవిస్తరంబుగా దెల్పెద వినుము॥ సంవాదము దర్వు

ధర్మ॥ వేటలాడ ఘోరాటవులందున - పాటిగ నేడో కనకాంగీ వాటమొప్పగ - వేడుకబుట్టెను - పరువడి వినుమీాభంగీ ॥ వేట॥

ద్రౌ॥ వేటలాడి మీా జనకుడు శాపము - సూటిగ గనెనో నాథా మాటలికేటికి కరపుటంబుల - మానుగ జెప్పెడి నాబోధా ॥వేట॥

ధర్మ॥ దుష్టమృగంబుల ఖండించుట దొరలకు తగదాపాంచాలీ। కష్టము మాకేమాత్రంబును గలుగదు వినుమీాబాలీ॥ వేట॥

ద్రౌపది॥ జోకతోడస ప్తవ్యసనంబుల, జోలికిజనదగదో రాజా।మీాకు చెప్ప నేనెంతటిదానను, లోకులుమెచ్చరునీ యోజా॥ వేట॥

ధర్మ॥ వట్టికొండ వెంకయ్యనుబ్రోచిన, వరదుడు రాముండుండగా। గట్టిగాను యెల్లప్పుడుమమ్ముల,గాచుచుదానుండుండగా॥ వేట॥

సంధివచనం॥ ఇట్లుబెట్టిదంబుగాబల్కి, సోదరసమేతంబుగా, వేటాడనేగ సమకట్టిన భయంబందినయంబుగా బొండవేయులతోద్రుపద వసుంధరానాథపుత్రివచించెనెట్లనిన॥

ద్రౌపది=దర్వు॥ దండియడవిదియుండగాలనుగా, పాండావులార॥ దండి॥ గండాకాచ్ఛభల్లా, కంఠీరవాళియు। ద్దండాముతోడూతమెండుగాక దిరుగుచు నుండు, నండ,గుండెఝల్లను॥దండి॥

నిండకోర్చియునెమ్మిగాంధారీ,సందానశతమూ॥నిండ॥ పాండవాగ కష్టాము, లందాగజేయాను! డెందాములోబూని,పందాలువేచియునుందు రెందు, సందులేకను॥ దండి॥

# సైంధవ పరాభవ నాటకము.

చింతగ లైనుస్వాంతమునచాలా।కౌంతేయులార॥ చింత॥ పంతాము మీరగ, దంతీచయంబులా।కాంతారమునజంపి, కదలీవత్తు, మను, యెంత; వింత, కాంతులార॥ దండి॥

రాణజానకి రామయూహ్వాయుసీ, రక్షించు రాము॥ రాణ॥ మాను నాకసీతారా, మాచంద్రకవులాస।మానూలగాజేసిమన్నించు మిమ్ముల। మాను, గాను, పీను, జేను॥ దండియడవిధి॥

సంధి=గీ॥ ఇవ్విధంబునవచియింపనవ్వఘూటి। మాటలాలించిభీము డేర్పాటుగాను। మొగమునందున జిఱునవ్వు మొలకలెత్త।సాహసోక్తులనుశి వెనుత్సాహమెసగ॥

భీముడు=దరువు॥ అవలాభయమేలా, ధర్మజు, డల్గినమదిచాలా భువనములన్నియు భగ్నముగావె, పొసగక్షణములోనా॥అవ॥ నాదు పేరు విన్నా, కలలో, పాదుగహరిగన్నా। వేదండంబులరీతిని వైరులు। విడువరె ప్రాణములూ॥అవలా॥

అర్జునుడనిలోనా, గాండీవ, మండసవినుచానా।నిర్జరేశ్వరుడైనను మారొ్కనినిలువగలడెచెప్పుమా॥అవలా॥

నకులునితోదురమూ, సేయగ, నాతియెవరితరమూ। ప్రకటితం బుగాదెలియనట్లుగా, బల్కెదేలనిపుడూ॥అవలా॥

అలసహదేవుండూ, యుద్ధము, నందుసనిపుణుండూ। చలముస రుద్రునిసరకుసేయడాగి, శౌర్యంబున తాసూ॥అవలా॥

రహినిసీతరాజూ, సీతా, రామచంద్రకవులా। మహిని వేంకయ నేలిన రాముడు, మన పాలిటగలడూ॥అవలా॥

ధర్మ॥ వ॥ ఓ భీమార్జున నకుల సహదేవులార! ధౌమ్యుండును ధాత్రికయు నీ ద్రుపదరాజపుత్రిక యొద్దనుండగలరు. గాన మీరలు నలుదిశలకు వెళ్ళి వాటంబగు మృగకోటుల గీటడంచి మాంసంబుగొని విచ్చేయుండని పనిచిదానొకదెసకుజనియె॥

సైంధవరాజు కొల్వు దరువు,

చోపుదారురాకడ॥ చోపూదారుడు వచ్చేనూ, సభజేరగా। సుందరామొగి – హెచ్చెనూ,। చోపూదారుడువచ్చె, చోద్యాముగా

భూపు,। డీపట్లకచ్చేరి, కేతెంచుననిదెల్పా॥చోపూ॥

కోలాహలములు మానుడీ, లేకున్న, కొట్టిచంపెదచూడుడీ, వాలాయముగకర, వాలామియ్యచేయంచు,। చాలాగజనులాను, రఘుడీ పించూచును దాను॥చోపు॥

జ్ఞానిమెచ్చిన లెంకాను, దిం గెదభీతి, మానీయునిశ్శంకానూ, బోనీయ నాయాజ్ఞ, పొలుపూగ మీరిన, పేసూల నెల్లాను, హింసింతు ననుచూను॥బోపూదా॥

జానాకిపతిప్రేమానూ, పట్టికొండ, జానాకిరామయ్యానూ రాణాతో శ్రీసీతా, రామచంద్రార్యులు మానూగరక్షించు మరివిను డనివేగ॥చోపు॥

చోపుదారు వాక్యం॥ ఓహూహూహూ, సభ్యులారా, మంత్రి సామంతులు గొలువ, జయద్రధమహారాజుగారు, కొల్వునకు వచ్చు చున్నారు, గావున కోలాహలంబులుమాని, యెవ్వరెవ్వరి స్థానంబుల, వారు నిల్చియుండుడు

సైంధవుడు రావడం దరువు

ఛేదు వేడలెనపుడూ। సైంధవుడాను। ఛేదు వేడలెనపుడూ। ఛేదు వేడాలెకడు పోడిమితోనుత। సీడుదొరలుగొని, యాడగ వేడుక॥ఛేదు॥ చేతఖడ్గాముబట్టియూ। బంగారువల్వా, చెంగూలుజార గట్టియూ, ప్రీతి గాను మొలబిగియించి ధట్టిని। ఖతిల్లి జనులంత, బిరబిరనాడుగగ॥ ఛేదు॥

మకుటాముభుజకీర్తులూ, దాల్చియుముండగా, నకళంకాముగ చారులూ। ప్రకటీతముగ బార, బరులు సల్పుచు నడువ। మొకమూన చిఱునవ్వు, మొలకలెత్తగ వేగ॥ఛేదు॥

రామా బెల్లముకొండవారి పాలెముధామా, రమణవట్టికొండ వారి, క్షేమవేంకయ్యనేలి, సీతిరాజుసీతా. రామచంద్రకవుల, రక్షించు మంచును॥ ఛేదు॥

సైంధవ వచనము॥ ప్రధానోత్తమ, సమస్తజనంబులు పరివేష్టిం చియుండ, నేనుండునిండుకొల్వు, యెంతవింతగానున్నదోయి చూచితివా॥

దరువు॥ సంవాదము॥

సైంధ॥ సచివవరమన రాష్ట్రమెల్లను, చక్కగా శోభిల్లునే। శుచి దలిర్పగ బ్రాహ్మణ, స్తోమముల్వర్ధిల్లునే॥ మంత్రిశేఖరా॥

మంత్రి॥ సైంధవేశ్వర రాష్ట్రమంతయు, సరవినున్నది వృద్ధిగా। సందియంబునులేదు విప్రులు, సౌఖ్యులైరి నిబద్ధిగా॥ రాజపుంగవా॥

సైంధ॥ హెచ్చుగా పరరాజ సంఘము, వచ్చి కానుకలిచ్చిరే॥ అచ్చుగా మద్విభవమున్గొని యాడుచున్మది మెచ్చిరే॥ సచివశేఖరా

మంత్రి॥ కడిమి రేడులు నీకులోబడి కప్పముల్ జెల్లించిరీ। వడ కుచునుభయభక్తులలవడ బాగుగా గీర్తించిరీ॥ రాజపుంగవా॥

సైంధ॥ దేశచారులు యేవిశేషము: దెల్పిరో వినుపింపుమా। ఆశతోవినకాంక్షకలిగెను, హాయిగానుగ్రహింపుమా॥ మంత్రిసత్తమా॥

మంత్రి॥ సాల్వకన్య స్వయంవరంబని, జగతివారలు చెప్పిరీ। నిల్వ గూడదు యేగవలయును నెమ్మిమీరగ నప్పురి॥ రాజశేఖరా॥

సైంధ॥ రాజులెందరు వచ్చినానా రాచకన్నె కోసమూ। నాజిలో వధియింపకున్నను నరయ దీసెదమీసమూ॥ మంత్రిపుంగవా॥

మంత్రి॥ రమణవెంకయనేలిశ్రీతా రామచంద్రాసూరులా। మమ తలిచ్చినరాముకరుణన్ మరియు గెల్వనుకూరిరులా॥ రాజశేఖరా॥

రాజ వచనం॥ మంత్రీ సకలకార్యతంత్రీ, పురంబు సుకరంబుగా గాపాడ భటులనియోగించి, కొంత కాల్బలంబును రప్పించితి, మనమి ప్పుడే తప్పకజనవలెను.

మంత్రి=వచనము॥ భవదాజ్ఞ ప్రకారంబు, సైన్యంబును రప్పిం చితి తమ మిత్రుండగు కోటికాస్యుండును, వచ్చుచున్నాడు॥

కోటికాస్యుని రాకడ=దరువు

కోటికాస్యుడేతెంచెనూ। సభకు। దేటంగకాంతులు మించెనూ। మేటిసింధురాజు- వాటమొప్పగదన్ను। మాటడరమ్మన్న, నీటుగుల్కగ నపుడు॥ కోటికాస్యు॥

వేటుపాగనొదాలజుట్టి। పైడి। బెత్తాముచేతానుబట్టి। ఘోటాకం

బులుదంతి- కోటూలు వెనువెంట। పాటిగబంటూలు- పరువాడినదునగ
కోటికాస్యు॥

పౌరాంగనలుబాగుగా। మేడ లాయూధినెక్కి-యుచూడగా। ధారు
ణీసురులంత- తప్పాకదీ ।వింప। మోరానజీలునవ్వు-మొలకలె త్తగనపుడు
కోటికాస్యు॥

బెల్లాముకొండపురిధామూడు। క్షితి। వేంకయ్య్యనేలు రాముడూ।
జల్లాగ సీతిరాజు జననావేంకటరాయ। సల్లలితార్యాని-సరవిబ్రోచునంచు
కోటికాస్యు॥

సైంధవు=వచనం॥ హేకోటికాస్యారమ్మి॥

సైంధవుడు స్వయంవరమునకు జనుట దర్వు.

గంధగజమునుయెక్కి- పురివెడలే। సైంధావరాజు॥ గంధ॥ గంధ
గజమును యెక్కి-వెడలెను-బంధువులు కాల్బలముగొల్వగ। మందరాచల
ధైర్యులగుతన- మంత్రులందరు వెంటరాగ ॥గంధ॥

కుందరదన స్వయంవరంబునకూ। నేనేగివాహ్వా। డెందమలరగ
నుండగానటకూ। మందగామినివచ్చివేరొక- పందభూపు వరింపజూచిన।
పొందుగానప్పణతి నేడిక-భుజబలంబున దెత్తునంచు ॥గంధ॥

రంగుమీరగ దానికుచద్వయమూ। గర్వంబుసైసై। భంగమొం
దగజేసి యీదినమూ। యంగహీనునికదనమందున- నింగితంబుగ నొం
చినాదగు । సంగచాతురిమెచ్చ జేసెదసాళ్వకన్యక నంచుమించి ॥
గంధ॥

వట్టికొండ జయరామయనూ। సంపన్ను జేసి। నట్టి శ్రీరఘురా
ముసత్కృపనూ। గుట్టుశీతారామచంద్ర- కోవిదులు జెల్వొందినట్టుగ।
గట్టిగా విలసిల్ల నెమ్మది-కాంక్షతో నారాము నెన్నుచు॥గంధ॥

సంధివచనం॥ ఇవ్విధంబున సైంధవుండు, సాల్వకన్యస్వయంవరం
బున కేగుచు తద్విపినాంతరంబున

మ॥ కనియెన్ సైంధవు డభ్రపంక్తి చికురన్ • గంధేభ రాడ్గామినిన్।
గనకాంగిన్ హరిమధ్యనబ్జవిలస • త్కంఠన్ గఠోర స్తనిన్।

వనజారాతి సమానచారుముఖినిన్ ♦ బద్మాభనేత్రన్మహా।
వనమధ్యంబున బర్ణశాలయెదుటన్ ♦ భాసిల్లుపాంచాలినిన్
వచన॥ గనివిస్మయంబంది మనంబున నిట్లనివితర్కించె॥

దరువు

సైంధ॥ ఔరాచిత్రమూ। యీ। నారీనిబోలీన, నారీని పీనాము ॥ఔరా॥ అంగాన జిగియంగమూ। యా! బంగారురంగూను, భంగాము సేయూను ॥ఔ॥ పన్నాగము వేనలీ। నడుము। పన్నాగసన్నాహమై-సున్నాగనున్నాది ॥ఔ॥ కన్నారనేగాకనూ। కన్నె। చన్నూలకన్నూల-చెన్నూమున్నెన్నాడు ॥ఔ॥ కూరిమివేంకయ్యనూ। బ్రోచు। శ్రీరాముడీవేళ-నీరామనోనగూర్చె ॥ఔ॥

సంధి-ద్విపద॥ అనితలపోయుచున్నంతలోమరుడు। ఘనపుష్పశరములు, కరమొప్పదాల్చి। చెరుకువిల్లునుచేత, జెన్నొందబట్టి। నెరిపికసైన్యంబు, నెమ్మిగానడువ। శుకరాజునారూఢి, సొంపుగానెక్కి। ప్రకటితంబుగసింధు, వసుధేశుజేరి। గక్కున జమిలిము, క్కాలినారియును చక్కగానెక్కిడి, చాపంబునందు। జలజాంబకములుర, స్థలమునసాట। విలసితంబుగతాను, వెగడొందిమదిని॥

సైంధ॥కం॥వరకోటికాస్యవినుమా।తగళాక్షినిగన్నదాదితమిమదిహెచ్చెన్
మరుబారికోర్వజాలను।మరిదానినిగూర్చినన్ను ♦ మనుపుముకరుణన్
సంధి॥ చ॥ అనగను కోటికాస్యవసు ♦ ధాధిపుడల్లన సైంధవాఖ్యునిన్
గనివినయంబెసంగ సర, ♦ గంజనితత్సతికిప్పుడే భవ।
ద్ఘనగుణకీర్తిసంపదవి ♦ తానములెల్లనుదెల్పి నీవశం।
బును దగజేతు నింక నెదపొక్కకుమంచు వచించి వెళ్ళుచోన్॥
వచనం॥ జంద్యాలపెద్దంభొట్లు, పంచాంగంబుచేబూనివచ్చి ధామ్యుంగని యిట్లనియె॥

దరువు

పెద్దంభొట్లు॥ ప్రయాణమైవస్సారా। ధామ్యావధాని ॥ప్రయా॥ నియోగులింఢ్లాలో- ప్రయోజనంబాస। నయాంబుమీరాగ-రయంబుతోడాను ॥ప్రయా॥

ప్రతిదినంబును భక్ష్యాలాష । హితమగు పప్పూధప్ప శమాష।
ఘృతమునుబహుపోస్సారాష। శతనక్షత్రములిస్సారాష ॥ప్రయా॥

వంగపిందెలువండేరాష - పొంగలి చిత్రాన్నంబాష - పొంగులు
బారుపరమాన్నంబాష - వంగివంగి వడ్డించేరాష॥ ప్రయా॥

వాగకాంతలాడేరాష - పట్టుపంచ కేవచ్చేరాష - చేరి తమాషా
చేసేరాష - శేషంభొట్లకు తెలసిందాష॥ ప్రయా॥

వట్టికొండజయరామయ్యాష - భాగవతమునాడించునాష - గ
ట్టిగను సీతారామచంద్ర - కవులుచేసిన చరితామాష॥ ప్రయా॥

సంధివచనం॥ అనిజంద్యాల పెద్దంభొట్లు పల్కుచుండగా, వార
ణాసివెంకంభొట్లు వేగంబుగా నాక్రోశించుచువచ్చి మావర్ణ శాలలోనొక
శాస్త్రాలము ప్రవేశించిగోంకిరించుచున్నదిరమ్మని, బిలువవంచాగంబులు
బారవైచి, ధౌమ్యునిసమేతంబుగా నాపెద్దంభొట్లుజనియె నంతద్రౌపది
చెలికత్తెతో వనశృంగారమును గూర్చియిట్లనియె॥

దరువు

ద్రౌపది॥ ఇంతీవనశృంగారమూ। మన। మెంతానివినుతింతుమూ।
వింతయా కొలనూలు। నంతావిహరించిసీ। చెంతా,బల్దంతూలుబంతాము
లాడును॥ ఇంతీ॥

పీకతొనాడుచునూ। తమ। పింఛముల్విప్పియునూ। చీకాకుజెందా
క - నీకాననమ్మూన। జోకాసత్కేకూలు, కేకాలువేయూను॥ ఇంతీ॥

శంకాను విడనాడుమూ। నిరాటంకాముగనుచేరుమూ। గొంకక
గజనిమ్మ - కొమ్మలపైనసీ। వంకాగొ -ర్వంకాలు -బింకాముతో గేరు॥
నింతీ॥

మాసితమకరందమూ। ద్రావి। మానూగనళిబృందమూ।జాణతన
మ్మూన - సలిపేటిగానమే। కొనాలం - దైనాను-గానాము- గానాము॥
ఇంతీ॥

పండిన కాయలనూ। కప్పు। నిండానుమెక్కియునూ। దండికోతుల
దండు - కొండాలుడొలిపిప్ర। చండాయుద్ధం డాము - మెండూగనొన
రించు॥ ఇంతీ॥

లేతాకుదిని చిల్కలూ। రొద। చేతామెలంగుట్టులూ। నాతీరోగను పొంచి చేతూలవశిబట్టి। చూతాము-వేతాము-మేతాలు వీనికి॥ ఇంతీ॥

జానకీరామయ్యనూ। దయ। తోనూసిపలిచ్చియునూ। మానాక మనిపిన-మారాజపూజకా॥ నూనాప్ర-సూనాము- మానీని గోయుము॥ ఇంతీ॥

సామూజయానాశీతా।రామ। చంద్రార్య వీరాజితా కోమాల వరవాక్య-కోటూలదెలస్రీ। రామాహాత్యాత్కా-ములని-వేమారు దలంచి॥ ఇంతీ॥

సంధివచనం॥ అంతలో మంచిసమయంగని పొంచియుంశిన కోటి కాస్యుండేతెంచి ద్రౌపదింగాంచి యిట్లనియె॥

దర్వు

కోటికాస్యుడు॥ ఎరిగించావమ్మా, నీవెవ్వారో, యేర్పాడకొమ్మా వరగొంద నేలనీ పేరేమియూరేమి యిరపూగ తలిదండ్రు లెవ్వారోనా తోడ॥ఎరిగించావమ్మా॥

యేకాత ఖూపూ- యీకానాలో నిప్పుడున్నావూ యేకాంత ముగనిన్నా, యిట్టినట్టడవిలో పీకాతోనుంచిన,వృజినాత్మ డెవ్వారో ॥ఎరిగించావమ్మా॥

మగడెవడెనీకూ చిప్పవబుమ్మా- మగువారోనాకూ దిగులొందిన ట్టుగ - దెలుపూచున్నది నీదు మొగమూ చిన్న వోయి తగినవాడుడు కాడా ॥ఎరిగించా॥

వీరవీగనోలి- పట్టకొండ వేంకయ్య నేలి సరవి సీతారామచంద్రా ర్యులకు వాంఛ లరయానిచ్చిన రాము,యానామేలొందేవూ ॥ఎరిగించా వమ్మా॥

ద్రౌపది॥ ద్విపదార్థం॥ వినవయ్య నాపూర్వవృత్తాంతమెల్ల। విను పించెదనునేను, విశదంబుగాను। పాంచాలి పేరుచే, బరగెదుదాన। పం చాపాండవులూ - మరినాధవులూ - నుంచీనరణ నూయాలు।సంచితంబు గవేట - లాడి కారడవులు। మంచిమాంసముదెత్తు - మంచూనగిరివేగ ॥పంచాపాం॥

కోటికాస్యుడు॥ ద్విపద॥ అతివనీ వృత్తాంతమంతయు వింటి।నతు లితంబుగ మోద మావహిల్లగను। వినుము నాసంగతి వీనులారంగ। ఘనసైంధవుడు సాళ్వ, కన్యకామణిని। వైవాహికంబాడు, వాంఛతో దుతను। భోవుచు భవదీయ, మోమును గాంచి। మోహించియెవ్వరా, పూబోణియొకొ। మోహంబుదీర్చక, నేగునేయుచు। నన్నుబుత్తెం చెను, నాపేరువినుము। యున్నతికోటికా, స్యుండునిజంబు। చిత్తజకేళిని, సింధుభూనాధు। నిత్తరి గూడవే హేసరోజాక్షి॥

॥శా॥ మత్తారాతి భుంజగ పక్షిపతిశుంభద్వైభవేంద్రుండుభా స్వత్తేజం డురు నీతిశాలి హీనురు, గ్వక్షుండు రూపంబునన్।
విత్తాధీశతనూజ సన్నిభుడు స • ద్విద్యాకశతానందుడు
దృత్తాగుణ్యుడు సింధుదేశపతి కాం • తారత్నమా గాంచుమా॥

కందార్ధము॥ రాజాధిరాజులెల్లవి-రాజితముగ నొదిగి యొదిగి, • రహికప్పములన్। భూజనులెన్నగ నిత్తురు రాజీవ సమానపాణి• రమణీయవాణీపన్నగవేణీ. రమణీ పూబోణీ॥ కమలారివదనుండు, కనకాద్రి ధీరుండు। విమలాత్మ్మజైనయా, వినుతగాత్రుడువేగ। క్రమముగా తన బలము గొల్వగ-ఘనశరంబులు దాల్చి పార్థివసమదకుంజర నాయకుండదె- స్యందనంబున నున్నవాడు॥రమణీయవాణీ।

సంధివచనము॥ ఇవ్విధంబునబల్కు, కోటికాస్యుని దుర్భాషణంబులువిని, తొక్కత్రొక్కిన పాముభంగి, క్రోధఘూర్ణాయమానసయై ద్రౌపదికర్ణంబులు మూసుకొని యిట్లనియె॥

ద్రౌపది॥ దరువు॥ వినను వినను నా వీనూలతోనూ। ఘనదురాత్మక నీదు మోమిక-కనులజూడగ రాదురా॥విననూ॥

హరిపుత్ర భవునిక్రోధాగ్నిలోబడియూ- విడివిగాశలభంబుకరణి- విలయమౌదువు సత్యమూ।విననూ॥

వడముడితన కేలా - భాసిల్లుగదకూ- విడువకను మడియించి నాహృతి- వేగసేయును దుష్టయకా।విననూ॥

విజయుడు గనినని- విపినమ్మునకునూ- నిజముగను బలిసేయు నేర్పున- నేనబద్ధము బల్కరా॥విననూ॥

# సైంధవ పరాభవ నాటకము.

నకులసహదేవులు- ప్రకటితబలులూ- సకల దేవతలద్దమైనను- ఘోషాసంబున ద్రుంతురూ॥విననూ॥

ఘనతర వెంకయనూ - గాచు శ్రీరాముఁడనయము దంఙించు క్రూరుడ-హాటము లేటికి వెళ్ళరా॥విననూ॥

సంధి॥కందం॥ అనిబల్కి- భయముచేతను వనితామణి పర్ణశాల వణకుచు జొచ్చెన్ । గని కోటికాస్యుడప్పుడు - ఘనసైంధవరాజుఁజేరి కదువడి నుడివెన్॥

కోటికాస్యుడు॥ ఓరాజా!

కందార్థము॥ తమయాజ్ఞ మస్తకంబునఁ గ్రమముగధరియించి వెళ్ళి కనుగొంటిని యా। రమణీమణి ద్రుపదాత్మజ, ప్రమదంబున నీదు కోర్కె- బల్కితి రాజా।కవిసుర భూజా-భాస్కర తేజా। కల్కి-యునాపైన క్రౌర్యము బూనియు చుల్కాగ మాట్లాడ, శుంఠానీకిది మేరములు్కలకు బలియిత్తురిప్పుడు పోరపాఁ డవులన్నరుఁడియకఁ చిల్కు-రాయని తోతు చివ్వను। సింధుభూవరుబెనగుమనుచూ॥ బల్కితిరాజ॥

సైంధవు వచనం॥ ఓహోకోటికాస్య, అట్లయిన నేనేగి, నయ్యతి వన్ రతిపతి సంగరంబున, నతులగతులసమ్మతింపంజేసి, బెనంగివచ్చెదను, లేనియెడల బలత్కారంబుగబట్టితెచ్చెద, నందాకనిచ్చట నే వుండుము, యిదేపోవుచున్నాను.

ద్రౌపదివచనం॥ అన్నయ్యాకూర్చుండుము, యావన్మందిక్షేమ మేగదా=సైంధవువచనం॥అంతాక్షేమముగానున్నాము. నీకునీపతులకు మంగళంబేకదా॥

ద్రౌపదివచనం॥ మాక్షేమంబులు వేరెయడుగవలయునా? మీబావలీరోజున నాకలికోర్వజాలక, మృగమాంసమునకువెళ్లియున్నారు

సైంధవువచనము॥ హేద్రుపదపుత్రీనాయుదంతంబంతయు కోటికాస్యునిచే యిదివరకేవినియుంటివిగదా. మరుబారికోర్వజాల, కాలయాపనంబేల॥

సైంధ॥ దరువు॥ కనకాంగిరో లేవే-కౌగిలియ్యావె॥కన॥మనములో పలయోచనేలను, మదనుశరములకోర్వజాలను॥కన॥ కోమలినను నేడూ,

గూడునీతోడూ॥ కోమాలి॥ యేమిగావలెనన్న నిచ్చెద, నిచ్చకంబులుగా వ్రనె చ్చేరీ॥ కన॥ కనులెత్తిచూడునా, కెనతేడులేడూ॥ కను॥ వినుము యీపదునాల్గుజగముల, వెదకిచూచిననొకడుగాని॥ కనకాంగి॥ మహి వెంకటయాఖ్యదా, మానుగనేలూ॥ మహి॥ రహిని రాముడు బ్రోచునీతా, రామచంద్రాకవులమనలను॥ కనకాంగిరో॥

ద్రౌపది=కందార్థం॥ అలకురుసోదరియగు దుస్సలపతి వీవగుటవ లన సైంధవనాకుఁ బొలఁపుగ నన్నవుగావలె కలయగ రమ్మనుట నీకుఁ క్రమముగాదన్నా ఘనసంపన్న కవిసుప్రసన్నా। విమలాత్మ ధర్మములే, విడివిగ నేరుగావె। కుమతిజనంబులు కోరనట్లుగ చాలా। భ్రమతజెందగనేలదెలియక బల్కుపల్కులలెక్కసేయరు। కమల సంభవ భవులునైనను గానచెల్లెలి పొందుగోర॥ క్రమము గాదన్నా॥

సైంధ=కందార్థం॥ కనులాయతాక్షి నృపధర్మమువిన లేదొక్కొ గోత్రమండలమందుఁ। బ్రహ్మదామణులెడ బార్ధివ। సముదాయము వానివె దుక జనదరాభర్మాంగి। గనుముపొంగి సత్యాప్రసంగి। ఘనముగవలసిన గతిసల్పాగనుజెల్లు। ఫణివేణియిందరాన, బాపామించుక లేదు। గనుక మారుని కుసుమమార్గణ, కాండముల పాల్జేసియిప్పుడు నెనరులేకను పాడిదప్పిట, నీకు వరుసలు నెంచజనదరా॥ చనదరా భర్మాంగి॥

ద్రౌపది=కందార్థం॥ శరభృద్వాహనుడగుని। ద్విజవరపతి గౌతమము హాత్మజాయామణితో। బరువడిగూడగ యోనులు। వరగాత్రమునందు బొడమి వసచెడెభూపా! భావజరూపా, భవ్యప్రతాపా! పొసగభూజా తను, మోహించి గొనిపోయి। వసుమతి నేపాటి వర్ధిల్లెదె తేయి। వినుర పతియగారావణాసుర, వీనవర్యుడు బొండనాప్తుల। బినరుహాక్షుండైన రాముని, భీష్మశరములకిచ్చి తుదకు॥ పసచెడెభూపా॥

సైంధ=వచనము॥ ఓనారీ యీవృధాగాధలేల, ప్రస్తుతమాలోచింపుము

సైంధ=కందార్థము॥ పరులకు ధరణీరాజ్యము। కరమొప్పగగొలుపోయి కాంతారమునన్। సరివారెల్లనుసునగదు। వ్యకరదశతోనుండు పాండు జగతీశసుతులా। గూడిననబలా। సౌఖ్యామెవిప్పులా। మృగనేత్ర

సంపాదహీనులజేపట్టి। యగమూలపాలుః నీవైతీవిబేలావై। తగదు కామి నియింగనై నను- దంచివాడను నన్నుగాకొని। దిగులు బాసియు శ్రీవహిం. పుము-దృఢముగా వెయ్యేలనితరా॥జగతీశ॥

ద్రౌపది=వచనం॥ ఓధాత్రికా, యిప్పాపాత్ముండు, నయవాక్యంబులజిక్కబడడయ్యె. పాండవుల రాకయుతడవయ్యె, కానిమ్ము ఆపన్నరక్షకుండైస వెన్నుండు. నన్ను నెన్నుగామన్నింపక మిన్నకుండునా అయినను ॥శ్లోకం॥ అహో ప్రకృతిసాదృశ్యం। శ్లేష్మణోదుర్జనస్యచ। మధురైఃకోపమాయాతి। కటుకైరుప శామ్యతిః అనగా-మధుర, మంచి మాటలవల్ల, దుర్మార్గునకుదుర్గుణాధిక్యంబును, మధురా, మధురద్రవ్యములవల్ల శేష్మరోగమునకు గుణాతిశయంబునగును కటుక-కఠినోక్తులచే దుర్మార్గునకు శాంతంబును, కటుక- ద్రవ్యములవల్ల శ్లేష్మరోగము ఉపశమనంబునగు, గాన స్వాభావంబున, శ్లేష్మరోగంబును, దుర్మార్గుండును సమానమని, బోధించునీతి వాక్యంబు, వృధయేలనగు, కాబట్టి పరుషవాక్యంబులచే, నీనీచువెళ్ళబుచ్చెద॥

ధాత్రిక=వచనం॥ కలికీ, చిలుకలకొలికీ నీపలుకు యదార్థంబే। తద్విధంబుననే, నీదురాత్ముని వెళ్ళబుచ్చుము॥

ద్రౌపది కందార్థం॥ ప్రళయాగ్ని కీలంగారగ విలసితముగ జేయువచ్చు విపులాస్థలిలో। నలధర్మరాజ కోపా • నలమును జల్లార్పరాదురా నాతోడవాదురా ధర్మముగాదురా।నయమేలలేదురా।పాతకమానస ప్రబలమాతద్వహ్ని। వ్రాతామునోశల భంబురీతిని నీవు। భూతివైపోయెదవునిక్కము, ముందుగా దెలియంగ జెప్పితి। ఖ్యాతిగాదున్న లకుభర్తవుగాన మిక్కిలి కరుణచేతను॥నాతోడవాదురా॥

సైం॥ కందార్థం॥ ధర్మములుపన్యసింపుచు। నిర్మల బ్రాహ్మణులతోడ నిగమవివాదం। బర్మిలిసేయనెగానీ॥ ధర్మజుడొగి యుద్ధమన్న తహతహపడదే। వెన్నిచ్చిచనడే। దగపోరగలడె రహీరాజధర్మాముల్ ప్రాకటంబుగ మాని। గహనభూములయందు కాలంబుగడుపుచు। విహీత మొప్పగ కుడువ కూడును, వెలయలేకను సరవిలజ్జా। రహితుడై మేనెంచి సోదర॥ సహితమడలుచునున్న వాడు॥తహతహపడడే॥

ద్రౌ॥కందార్థం॥ ఉద్దండ గదాదండము । తద్దయు భుజమందు బూని- దండధరుగతిన్ । యుద్ధమునకు భీముడుతా । గర్జన సన్నద్ధుడైన, గాంచీ నీసేనా । జచ్చును హీన । కమలాక్షుయానా । పంచాస్యమునుదంతి, వారాము కలలోన । సంచితంబుగజూచి, హతము జెందిన భంగీ॥ గాంచీ నీసేనా॥

సైంధ॥ కందార్థము॥ కోకోదరు నేనెరుగనె । వీకన్బొగడంగ నేల, వినుమాతనిచూ । పాకారంబును పోటుని । రాకారముగాదె చూడ రణము నాతోడా । జేయగనీడా । రహినోకిపోజ్జా । ఘనపాకమునుజేసి, కడుపు మానముదప్పి । తినుటయందున తప్ప, శౌర్యమున గొప్ప । పనులకెల్లను బనికిరాడు, బాపుకే యోచింప దెలిసెను । దనరకల్లలు బల్కి- తటుకున, దాటిపోయెడు నీదు జాడా॥ రణము నాతోడా॥

ద్రౌప॥ కందార్థం॥ జంభోద్రేక స్తంభకు । శంభద్గర్వంబణంచి చోద్యమెలయ నం । రంభమున నగ్ని కాహుతి । జృంభణముగ ఖాండవంబు నిచ్చిన ఘనుడూ । నూరక జన ... । వచ్చిననతడూ జచ్చెద విచ్చోట నచ్చ్యాగయచ్చ్యాలు । బొ ... ము లేకాను,గ చ్చా। రబల్కాకు ।.తుచ్ఛనీమొన బచ్చి పోలసున, గచ్ఛుదీర్చునుపక్షిజాతికి । మచ్చుకొక్కని నైన విడువక హెచ్చిఘర్మతనూజుడా॥ నిచ్చిన నతడూ

సైంధ కం దార్థం॥ తెల్లని మొగములు మేనులు । నల్లనజెలు వొందునట్టి హయముల దేరున్ । వెల్లంబుగ నెక్కేడువా । దుల్లంబున నెంచ నెంతా, యోధుడు చెపుమా । నాతోసమమూ । యెన రాగవినుమా । భూధరములయందు, బోనంబు లేకను బాధనొందెడు శ్వేతా, వాహనుడగయూగ ॥యోధూడెచెపుమా॥

ద్రౌ॥ కందార్థము॥ కలహాజేయున్పరమం । డలదర్వీకరవితాన, నకులున్ నకులుః । ఖలసంహారరధికోత్తమ । చలమున నలిగించి తేని, సత్యాముసుమ్మా । జచ్చెదవునమ్ము - సరవిపోపొమ్ము । మృత్యుదేవత నోటిరెండు కోఱలజిక్కి । భత్యాముంజెనదాను. బ్రతుకావచ్చును గాని। నిత్యమొప్పగ నతని బారిన, నిల్చియుద్ధమొనర్ప బూనిన । హాత్యజే

ము సైన్యయుతముగ, నర్థనిమిషములోననిన్నా ॥సత్యామునమ్మా॥

సై=కందార్థం॥ తగనిండు కొల్వునకునీ । శిగబట్టియునీడ్చి దెచ్చి, చీరెలు యొలువన్ । మగటిమిగలిన నకులుడు । నొగిజగడము సేయకూరకుండునెమగువా - మరినే వెరువా - నోసీనిన్నిడువా । దండిమీరనవ, ఖండాలాధీశుడై । యుండూనూయోధనున, కండాగబావమై । భండనంబునగెల్చి రాజుల - పన్నుగొన్న బలాఢ్యులితరులు । గండుమిగిలిన మాటలాడిన, గాని పూనిక నాచరింప ॥కుండూనె మగువా॥

ద్రౌపది=కందార్థం॥ సహదేవుఁబరి పంథిని । వహగవానదహనువరహరి పటుశౌర్యసరో । రుహదళవిశాలలో చను । మహోగ్రరణమందునీవూ - మార్కొనలేవూ । చెప్పినవినవూ - మరిడాసెజావూ । కర్కశమగువజ్ర - ఘాతకోర్వగవచ్చు । నర్కనష్టమునకైన - నాగావచ్చునుగాని । చుర్కు చుర్కన నతడు ముల్కులు - సూటిగా బరపినను వెఱచియు । మర్కటంబులరీతినీ వొన - మనగ్రమాకుల పాలుగారె ॥మార్కొన॥

సైం=గీతార్థం॥ పొట్టితమ్ముడు గలిసయట్టి వేల్పు । నైనగెల్చెద సహదేవుడస్త్రశస్త్ర వేదియును గాడు బాలుండు వేడ్కతోడ । నన్నామార్కొనిగెల్చునా - యుద్ధమున నే- కన్నాదెరచిన నిల్చునా । పన్నూగా మరి కాయ - పండ్లను మెక్కుచు । ఖిన్నుడై మనమున, ఖేదామొందెడు వాడు ॥నన్నామార్కొని గెల్చునా॥

ద్రౌ=ఉ॥ కాలముడాయ వృశ్చికము, గర్కటియుంబాలు పొందగ్రుక్కునం । జాలునుదాల్చు చాడ్పునవసు ధరమండలి బాండు పుత్రులి । ల్లాలినిగూడు కామ మర, యక్కమది గల్గెజ మీా మహీశచాం । డాలవిధాత్ర చెయ్యులకటా గడవంగ వశంబెయేక్కిట ॥

సైం॥వచనం॥ హే ద్రుపదపుత్రీ-వృథావాక్యంబుల కాలయాపనంబుచేయ నేల। నాహృదయంబు భవదధీనంబైయున్నయది-కమలంబునువిడచి-భ్రమరంబుపోవనేర్చునే గాననిన్నువిడచి-చక్కగా గ్రక్కున మత్పట్టణంబునకు, నేగజాలనని, మిక్కిలినొక్కినొక్కి వక్కాణింపవలెనా. పూర్ణచంద్రవదనా॥

క౦॥ ఘోరంబుగ బాధించెకి। క్రూరంబగు పంచబాణ, రోషానలమున్।
గారుణ్యామృత వృష్టిని। నారీజల్లార్చి యేలు, నయముగనన్నున్॥

ద్రౌ వచనం॥ అన్నా హే సైంధవరాజా - నేజేయువిన్నపంబు తిన్నగా చెవిజేర్చుము॥

సంవాదం-దరువు

ద్రౌపది॥ సైంధావవినుము నామాటా నీకు, చావుదప్పకగల్గునిచ్చోటా। పొందూగాపాండవు-లెందుజొచ్చినగాని। సందేహామును లేదు-సాధించెద రునిన్ను। ముందుబారగజూడునిప్పుడు- మందిరంబున కేగుదిప్పను। మందబుద్ధిని తగదుశిక్షోను-చందమున జెడిపోదువకటా ॥సైంధావ॥

సైం॥ కాలాయాపన మేలబాలా- నాతో-కాము కేళిని దేలుచాలా తాళగజాలనీ-ధవులువచ్చినగాని। నాలాయముగనిన్నూ - వదలిపోవగ లేను। పాలముంచుము నీళ్లముంచుము- భ్రాంతిచేనీపాలబడితిని। రాలకంటె ను నీదుచిత్తము - రమణీకఠినమున య్యెనాహా ॥కాలాయాపన॥

ద్రౌ॥ మానూగనిలువుమీపూటా - బావ-మరుదులగనిపొమ్ము బాటా। కానవమ్మున జేరి గష్టాముందుచు నుండ। పూనికతో జూచిపో వచ్చెనని దెల్పి। మానసంబున నీవుజేసిన- హీనవృత్తులుదాచియుండెద। దీన నేవిధమైన మోసము- లేనిసుఖములు జెందగలవు ॥సైంధావ॥

సైం॥ కూరిమిదనర వేంచేయూ-వట్టి-కొండవెంకయనామధేయూ కోరకలిచ్చినీ, తా రామచంద్రాఖ్య। ధీరూల నేలీన, శ్రీరాము నెన్నుచు-। భూరిమోదమలర్పనిప్పుడె- సారసాక్షిశతాంగ మెక్కుము! వేరుయోచన సేయ నేటికి-విధికృతంబిదితప్పదికనూ ॥కాలాయాపన॥

సంవాదం-దరువు

ద్రౌపది॥ కల్లాగాదన్ననీ, చెల్లినియిటుబల్క, జెల్లాదుయూహింపరా। నావిన్నప-మెల్లాను చెవిజేర్చారా॥ పాండూసుతులా- నుల్లాము నందెంచారా। లోకులువిన్నా-నల్లాననిందించరా! యమకూపమునా-త ల్లాడిల్లగవేయరా! తీయురతోలు! నెల్లవిధముల మెల్ల మెల్లన-తొల్లివచ్చిన బాటబట్టి। యిల్లుచల్లగ జేరుమన్నల-పల్లవాధర వల్లభాయిక ॥కల్లాగాద॥

సైంధవుడు॥ జలజాక్షి యెన్నిప్ర-సంగాముల్ జెప్పిన-కలయూకనినువదలానే

నీమాటల-వెలయాగ చెవిబెట్టనే। పాండవులా-కలహామందున కూల్చునే యమబాధాకు-కలనై నభయమందానే। అదిగాక నే-నిలదూషణకునోర్తు నే। శేర్తునురావె। బలిమిమత్తుటభేదనంబును-భయముజెందగ నేలవినవె। పోలుపుగానీ రేడుజగముల- బోలువారలు లేరుననుస్నా ॥జలజాక్షి॥

ద్రౌ॥ సీతార్థమె మున్ను- శ్రీరామమూర్తిచే పాతాక దశకంఠూ డు। కొండంతవా-డాతని పెద తమ్ముడూ। శక్రుని గెల్చి- ఖ్యాతి జెందిన పుత్రూడూ। ధూమాక్షుడు- నాతాతమారీచూడూ। నిజబాంధవ-వ్రా తము లతికాయుడూ- మాయుడు నాది, నీతిహీన సురారివర్గము నిర్జెనం చును పుట్టబుట్టువు। ప్రీతిగా నచియించినట్టి, విమల గాధలు వినగ లేదె॥ కల్లగాదన్న॥

సైంధ॥ వరరావణునిజంప, నరసి విభీషణుడరిసఖ్యామును జేసేనే। మరుగై యున్న- నెరిమర్మాములు జెప్పె నే। ఆమీాదాట। హరిదానావుని ద్రుంచేనే। గాకున్నవా- డొరులాకుచై జకూ్య-నే। యీకధలన్ని- తిర మూాగ నేనెరుగానే। బెల్లాముకొండ। పురమునందున వెంకయాఖ్యుని, బ్రోచిసీతారామచంద్ర । సరసకవులకు భద్రి మొసగిన జానకీపతి గూర్చె మనల॥ జలజాక్షి॥

ద్రౌపది॥ సీసార్థం॥ ఆత్యుగ్రమైన, దివ్యాస్త్రజాలంబులు కరము న భాసిల్ల కాలభవుడు! శాత్రివబృందంబు సంక్షోభ మొందు మహాగద బూని బకాంతకుండు। ఘోరగాండీవంబు, గుణము సారించుచు, దుర్జన నిర్జితుండర్జునుండు। నిశితసాయకపంక్తి నేర్పుగా గాని కవ-లాహూతినామ ర్థామూ। జెల్వొందగా। నంబాకముల వర్షమూ। ధారాళముగ గురి య, తహ తహ పడునప్పు ॥ ఆగోరి దెలియుమహోద్ధతి నికదక్కు- ॥ మారూతినామర్షమూ ॥

సైంధ॥ వచనం॥ ఓనారి యెన్నినయవాక్యంబులుజెప్పినను నిన్ను విడచివెళ్లను, యింతవరకు నీవు సమ్మతించి వచ్చెదవని యూరకుంటిని, గాని లేనియెడల నప్పుడేరథంబుపయి చేర్చి నాపట్టణంబునకుగొంపోయి నీతో కేళీవిలాసంబుగానుందును. అయినను యిప్పుడేమాయెను. యిదె చేయిపట్టుకొంటిని యెటుబోయెదవు చెప్పుము॥

ద్రౌపది॥ వచనము॥ ఛీ-ఛీ-చాండాల నాచేయి వదలుము- నేను మొదటనుండియు జెప్పిన, నీతివాక్యంబులన్నియు, బూదిలోపోసిన నేయి చందంబున నిష్ఫలంబయ్యె సైంధవాధమా॥

ద్రౌపది॥ వచనము॥ ఓధాత్రికా యిటువంటి - యీదురాత్ము డెంతపనిచేసెనో చూడుము॥

ధాత్రికవచనము॥ ఓరినీచా-మహాపతివ్రతగాన, శాపంబిచ్చిన భస్మంబయ్యెదవు. విడువు-విడువుము—

సైంధవుని వచనము॥ ఇదేనీక త్తిచే నీతలను త్తరించెద, ధాత్రికా నూరుమాటాడక నోరుమూసికొని వెళ్లుము॥

దరువు

ద్రౌపది=విడువు సైంధవనన్ని కా, కౌంతేయులచే, వశిచెడిధర గూలకా। విడువు సైంధవయెన్ని విధముల, విన్నవించినగాని దెలియవు। పుడమిలోపలనన్న సోదరి, పొందుగోరగ రాదటందురు॥ విడువు॥

పరభామలనుగోరగా, పానురులదే, హారిపురమునచాలగా। కరుణలేకనువారుసల్పిన, కర్మమనమున నెంచి దుఃఖము। విరివిగాగను జెందు నట్టుగ, వేగ కాలుడు శిక్ష వేయును॥ విడు॥ ధనసంపదల బాసియూ, కాననములో, నానరుగానివసించియూ। వినుతి జేయుచు పూని వర్యుల, విధివశంబునగాయకూరలు। ఘనముగా దినుచున్న దీనుల, గాంచియిట్లానరింపదగదు॥ విడువు॥

జయరామయనుప్రోచియూ, సీతారామ, చంద్రార్యులమన్నించియూ దయనుబెల్లముకొండపాలెము। ధాముడై జెలువొందు రాముని। నయము గానమ్మానదానను. జయముగాదురనీకు వినరా॥ విడువు॥

సైంధ=వచనం॥ ఓద్రౌపది నీవుయెన్నివిధంబుల బల్కినను, విడువను, యిదేరథంబుపై జేర్చెతి, నికనడ్డంబెవ్వరు వచ్చెదరోచూచెద॥

ద్రౌపది=వచనము॥ ఓధౌమ్యులవారు నన్నుసైంధవుండుపట్టి రథంబుపై నిడుకొని వెళ్లుచున్నాడు. మీరైనావచ్చినన్ను విడిపింపరయ్యా॥

సంధివచనం॥ ఇట్లాక్రోశింపుచు దండనెవ్వరు లేకుండ నుండుట వల్ల భయంబందిడెందంబున నాపద్బాంధవుండగు శ్రీకృష్ణునిస్మరించి

నుతింపద్రౌపదిడంగెనెట్లునిన॥

ద్రౌపది=దర్వు॥ విడువడాయెసైంధవేశుడు॥ శ్రీరామా। రామా। రామా। విడువ॥ విడువడాయెసైంధవేశు డొడలుపడ వడవడకెనయ్యయ్యో॥ విడువ॥

పుడమిబాసీయడవులందూన! బ్రదుకుచునెంతో। యడలుచున్నా సమయమందూన। పుడమివానా లేకపిడుగు। బడినరీతిపోనగకేదూ॥విడువ॥ గుండెలదరి బెండూబడియెనూ। నాపెదవూలు। యెంటిదాహామెక్కు వయ్యెనూ। పాండవూలులేరుదండ। నండనీవే బ్రోవరావే ॥విడువ॥

కొలువులో నావలువలొలువాగ। నామానాము। నలనాకు గావి నావుగా। చెలగినాకు నభయమిచ్చి, బిలుకుమార్చువీని నిపుడే ॥విడువ॥

కోరి బెల్లాముకొండనగరీసీ। వెంకయ్యనోజ। చేరిచేసి భోగధు గ్యానీ భూరి సీతారామచంద్ర, ధీరులాను బ్రోచురామా ॥విడువ॥

దర్వు॥ శ్రీలోల బలిబంధనా- నన్నేలరా, సెవింతుఖగస్యందనా। నీలీలలెల్లాను, నీరాజానను కైన, వ్యాళానాధునకైనః నలవియోవర్ణింప శూలినన్నుతశీల కిల్బిష. శైలహారి గోపాలఖలజన। కాలధర్మసుచేల జల ధర, జాలనీల ఘృణాలవాల॥ శ్రీలోల॥

సూరివంద్య జనార్దనా. నతజనకుముద. సోమాకంసవిమర్దనా। వారాశిగాంభీర్య, పంచాస్య। వరశౌర్య। ధారూశిభృద్ధైర్య, దనుజాతి మిరసూర్య। నారదాది మునీంద్రభవనం, హారకౌస్తు భహారనినువే। మారకన్ భజియింతునిత్యము సారసాక్షకరీంద్రరక్ష॥శ్రీలోల॥

యాదావకులమండాన, వారణదైత్య, భేదికార్ముకఖండనా। భూదేవి కాళత్ర, పూర్ణేందునిభవక్త్ర। కాదేనరిపువత్ర, కైటభాసురజై త్ర। వేదవేద్యముకుందత్రిజగ,న్నాధభూధరధారననునీ। వాదరంబునజూడు యుష్మ, త్పాదములనెర నమ్మినాను॥ శ్రీలోల॥

పాకశాసనసోదరా, బెల్లంకొండ। వారిపాలెముమందిరా। ప్రాకా టముగసీతా, రామచంద్రాకవులు। శ్రీకరులనుజేసి, శ్రీతిజయరామయను। పీకపాలన సేయుమమురా,నీకనాకవసుంధరారుహా । సోకుమూకల గొంగ రాఘవ, లోకనేత్రసమాన తేజా॥ శ్రీలోలబలిబంధనా॥

దరువు

వినుకీర్తిసాంద్రా, యదుకులచంద్ర। ఘనరామచంద్రా ఇనవంశ మండాన, దనుజేంద్రఖండాన। మునిచిత్తసంచార, ముచికుంద మందార ॥విను॥

సరసీరుహాక్షా। సజ్జనరక్ష। సురవారపక్షా। హరిపైనకరిపైన, వరకుచేలునిపైన। బరపీనకృపకొంత. నెరపూమునాపైన॥ వినుకీర్తి సాంద్రా॥

కలుషవినాశా । రిపుగళపాశ । జలజాలయేశా।ఖలజాల నిర్మూల ఘనవాహ పరిపాల । జలద సన్నిభనీల, జనకజహృల్లోల॥ విను॥

కరమొప్ప భువినీ । సీతిరాజువేం । కటరాయ కవినీ । పరిపాల నముజేసి పరగ జయరామయ్యాకు । సిరులిచ్చి బ్రోచిన, మురదైత్య సూదన॥ విను।

సంధి॥ వచనం॥ ఇట్లుబల్కుచున్న ద్రౌపదిం దన రధంబుపై నిడికొని యేగుచున్నంతలో ధౌమ్యనామభూసురోత్తముం డటిత్వరిత గతింజనుదెంచి తద్వృత్తాంతంబెరింగినవాడై సైంధవుంజూచి యిట్లనియె॥

సంవాదం-దరువు

ధౌమ్యుడు॥ తగదోయి రాజ యీరీతి నాతి - తప్పాకవిడచూట నీతి । తెగువబూనకునీకీ. మగువా చెల్లెలువరుస । నగుబాటుజెందెదు నలుగూరిలోపల॥తగ॥

సైంధవుడు॥ నెరివాగబోకు భూదేవా, నాకు వరబుద్ధిబోధించు వాడావా । మరలిపొమ్ము నీవు, మర్యాదగానుండు మరుమాట బల్కిన మన్నింపనికసుమ్ము॥ నెరి॥

ధౌమ్యుడు॥ ఘనపాండు సూనులీ వార్తా నేడు వినినాను గిరి జాధిభర్తా । యొనర బారీపద, యుతమూగ దోర్దర్ప । నినువధియింతురు నిశ్చయంబుగనమ్ము॥తగ॥

సైంధవుడు॥ రహివెంకయార్యుని బాలించి, సీతారామచంద్రా ర్యులా మన్నించి । మహిని బ్రోచిన సీతా, మానినీ పతిసాక్షి । గహన భూమిక బాల్తి, గానాసంగెదనిన్ను ॥నెరివాగ॥

ధౌమ్యుడు॥శా॥ వృద్ధక్షత్రకుమార నీకు తగునే, హీనాత్మతో బుట్టుతో । నిద్ధాత్రీస్థలి పొందునీమొపతులీ, వృత్తాంతమున్విన్నచో । యుద్ధంబందున బెద్దనిద్దురనుబెం, షొందంగ జెందింపరే । సిద్ధంబేను వచించినాడ వినుమీ, శీతాంశు బింబాననన్॥

సంధివచనం॥ అనియాక్రోశింపుచు ధౌమ్యుండు వాని వెను వెంటనే జనుచుండె నంతయాజ్ఞసేనిశోకాయత్త చిత్తయై తత్తరంబున బెద్దయెలుంగున విలపింప దొడంగెనెట్లనిన॥

ద్రౌపది॥ దరువు॥ ఇంకపాండవుల చూచేనా। నేను యీచెర బాసి జీవించేనా। ఇంకాముమీర నిరంకుశముగనేగి। జంకూలేకను వేట స ల్పూచుండిరయొ॥ ఇంక॥

పాపిష్టివేటకై పోయి రి పతులు పరువడినొకరైన రారైరి। పాపా త్ముడీపట్ల బలవంతముననాడు॥ చేపట్టిరథమున జేర్చిజనుచునుండె॥ ఇంక॥

పంచాపాండవులేతెంచి నన్ను గాంచకమదిలో శోకించి। పంచత్వ మొందగ పనిబూనుదురో యేమొ। పంచ ప్రాణంబులు పరగవారలు నాకు॥ ఇంక॥

రమణ వెంకయాఖ్యనేలీ సీతా రామచంద్రకవులకోలీ కామరొంద సంపదల్ కొల్లగనిచ్చిన! సమద రావణవైరి సదయుయెట్లున్నదో॥ ఇంక॥

సంధి॥ ద్విపద॥ అక్కడపాండవు లటవీస్థలంబు నక్కజంబొప్పగా నరిగియుసార। సారసాకరములు, క్ష్మాధరబిలము। లారామములుశల, లన్ని గాలించి। వారణంబులఖడ్గ, భల్లూకములను।ఘోరసింహమ్ముల, కోలౌఘ శరభ।శార్దూలబృందము, న్సాహసంబునను। మర్దించి నిల్చిద్రుమంబులక్రింద।తియ్యనికాయలు తేటరసాతేనె।సయ్యనభక్షించిసలిలంబుగ్రోలి।జోకతో వారొక్కచోటనుగలసి।ప్రాకటబలులైన పాండవులంత। విశుతారథముల, వెలయంగనెక్కి। యాశ్రమాభి ముఖులై యరుదెంచునెడను॥

ధర్మరాజు॥ ద్విపద॥ తమ్ములారావిదితంబుగా నిపుడు! తమ్ముల చెలికాడు దనరెడుదిక్కు।నుండియెలుంగింప, నురుగతిదొనగె। నండజాత ముల మ్రు,గావళి భీమ్మ।రుతముజెలంగె సూ,నృతముగావరదు। నతిభయా నకముగా,కళచెదావలను। పరులచేనవమాన,పాటునరణము। పరగల్గు వి

నుడీ, శకునంబుకరయు। నువిదనుయెుంటిగా, నునుచి వచ్చితిమి। వివరింప ధృతరాష్ట్ర, పృథివీశసుతులు। మనకెగ్గుసేయను, మాత్సర్యవృత్తి।ననుది ంబు నుయెంతు, రాత్మలయందు। గావున మీారలు కదువడిర దు। బోవుద మాశ్రమ, భూమినిజేర॥

సంధి। వచనము॥ అని యివ్విధంబున తమ్ములతోఁబల్కి శీఘ్రంబుగా బయలుదేరి వచ్చుచున్నంతలో ధాత్రిక శోకంబువిని ధర్మరాజ రథచోదకుండైన, యింద్రసేనుండు, రయంబునవచ్చి॥

యింద్రసేనుడు॥ వచనం॥ ఓధాత్రికా । నీవేలదుఃఖించెదవు, నీకెగ్గుసల్పిన, నీచాత్ముండెవ్వడో డల్పుము, వానినిఖండించెద॥

॥-దరువు-॥

ధాత్రిక॥ అకటాకృష్ణను సింధు, అవనీశ్వరుడువేగ, నయ్యయెు్య చెరబెట్టెనూ, బెట్టెనూ, బెట్టెనూ, ప్రకటితముగధర్మ । రాజాదులందూన । నొకరైన లేకాను, యెుంటిగనిందుంచి। సకలమృగముల సంహారంచను, జవముతోడనువెళ్లగాల్పల-నికరయుక్తుండగుచువచ్చియు నిజముగామోహించి నేడు॥ అకటా॥

అరయూనన్నపునాకు, నపక్షిర్తిపాలౌదు వన్నానుచెవిజేర్చకా జేర్చాకా జేర్చాకా సరసీజాక్షిరాసిన్నా స్వాంతాజుకేళిని। సరగూన దేలాక జనజాలవెయ్యేల। నరుగుదెంచుము పట్టణంబున కమితభోగములబ్బునిప్పుడు। పరువులోనబోలు రాజులు, పాటిగాలేరంచుబల్కి॥ అకటా॥

దురితామానసపాండు, వరతనూజులుతల, ప్రంతూరంబుధి చొచ్చినా, చొచ్చినా, చొచ్చినా,। పరసతితోపొందుభావ్యముగాదుర। హరిలోకమందునానగ్నిలోవ్రేల్చార। మరియు జీల్చరఫలముబక్షుల,మండలంబులకీడరదుస్సల। పరధవాధమయున్నవినకను, పట్టిరథమునబెట్టి పామరు॥ డకటా॥

విరివిగవట్టికొండ, వెంకయ్యకోరికలు, వేగామెునాసగూర్చియూ గూర్చియూ, గూర్చియూ ధరసీతిరాజుశ్రీ। తారామచంద్రార్య। వరులానుపోషించి, చిరబెలాముకొండ, పురమునందుగవెలసినట్టి, భూమిజా

# సైంధవ పరాభవ నాటకము.

ద్రౌపదయేశుసాక్షిగ। కరముగానామాట నమ్ముము, కల్లగాదో యింద్రసేనా॥ అకటా॥

యింద్రసేనుడు॥ సీసార్థం॥ ఉత్తమశీలన, యోనిసంభవనుమోహాంధచిత్తుండైనసింధుపతికి। నుదుటుగల్గెనెగోని యొగిపోవబోయెపో భూతలగతుడైన మొయిలుదారి। కొగసిపోయినగాని మృతినొందచేయక విడుతురేవానిస భీమబలులు! వీరలదారుణవిశిఖకౌశలమును దెలియాడు గాబోలుబేలా। నెరిగిననిట్టి-తెగువాకీవేళా। దలపాగబూనునె- దగవాని కాయువు।వెలయాగనిండుట-వెలదీరొమనమున।దెలియాడుగాబోలుబేలా

ధాత్రిక=వచనం॥ పంచపాండవులారా, యీసంగతులన్నియు వింటిరిగదా॥

సీ॥ క్షీరంబులోబోయు, సర్పిబోలెను,బురదను బడినట్టి, పూదండవోలె। జగతికాలేయక, చర్మపుతిత్తిలో, వెసజేర్చుకపిలగోరసము వోలె। ఖలుచేతదూషిత, గాకముందెమీర, లరుగుడీయివ్వుడి, ధ్వరణీదగునె। వరపురోడాశంబు, నరయంగచెప్పులు, మెక్కెడుకుక్కకు నిక్కువముగ। జనునెసారసమకరంద సారలీల। రహినిశవఖాదియైనఘోరవమున కును।గ్రమమెవీరపతివ్రతా, రమణియాజ్ఞ।నేని సైంధవాధము, చెరలోన బడుట॥

భీముడు=వచనం॥ దండధరనందనా, నిండుకొలువున పాంచాలి వలువలు, వలుచునాడే యమద్వారంబు చూచునట్టి - దుష్టాత్ముల, నన్నునీయాజ్ఞా పాశబద్ధునిజేసి వారలంబ్రతికించితివి, గాననిప్పుడీ బన్నంబౌనగూడె, నింకనైనా సెలవొసంగుముద్దండ గదాదండంబున, భగ్నబున సైంధవుతలను చెండాడిపిదపదుర్యోధనాది శతంబునుపెద్దనిమురజెందించి నీకుయీాసత్వసర్వంసహాఖర్వరాజ్యంబును,పట్టాభిషేకంబుకావించెద

ధర్మ=వచనం॥ తమ్ముడా భీమసేనా-యింతపనియుచేయగలవాడవే॥

అర్జునుడు=వచనం॥ హేయుధిష్ఠిరా- యిప్పుడీ, వృకోదరుండాడిన మాటలు, లెస్సైయున్నయవి- నీవుధర్మంబాలోచించితివేని, మనజీవితానంతరమువరకు, వనవాసక్లేశంబు, ననుభవింపక తీరదు, గానసెలవొసంగుము॥

ధర్మ=వచనం॥ అర్జునా- యింతతొందరపడనేల- మన మొడంబడిన ప్రకారము- బంగ్రెండేండ్లు వనవాసంబును, నొక్కయేడజ్ఞాతవాసంబును, నాచరించిన పిమ్మట, నీకరకౌశలంబుచే బాణంబులతిమురిగా బరిపి, మనకెగ్గొనరించిన, దుర్యోధనాది శత్రు బును, మహోత్కంఠబునం బేచ్చి, కంఠలుంఠనం బొనరించుటయుక్తంబు-యిప్పుడే సల్పిన, ధర్మవిరుద్ధంబుగానుండదే, నన్ను ధర్మంబున ఘనుండని యెంచునట్టి, కురువృద్ధులైన, బాహ్లిక, సోమదత్త. భీష్మదులును, గురూత్తములైన- ద్రోణ- ద్రౌణి, కృపాచార్యులును జెంపంబున నిందింపరే పురందర నందనా॥

మాద్రేయులు= వచనం॥ అన్నయ్యా, యీవృథాప్రసంగములు మాని, కాలయాపనమేల జేసెదరు- మనద్రౌపదిని- ఆజయద్రథాధముం డేమిసేయుచున్నాడోకదా, యీభూచక్రంబుల, రాజశక్రచక్రంబుల, నిర్వక్రపరాక్రమంబున, క్రమప్రకారంబునగెల్చునట్టి, జగదేకవిక్రాంతులైన, పంచపాండవుల చేపట్టినది మొదలు, పాంచాలికి, నిట్టి బెట్టిదంబులగు, యష్టకష్టంబు లేగదా ప్రాప్తంబులయ్యెను॥

భీముడు॥ వచనం ఓఅన్నయ్యా ధర్మరాజా॥

దరువు

భీముడు=శెలవొసంగు, మన్నజాగు, సేయనేలనూ। శెలవునిచ్చి బంపిరేని। నలుగులబెప్ప- బలముల నెత్తురు, గొలుకగజేతును॥శెలవొ॥

అర్జునుడు=సైంధవేశు - మదనజ్వరము. శాంతిజెందగా। బంధురాంబకాగ్ని చేత।గుందగమది. శిక్షలపాలు, పొందగసలిపెద॥శెల॥

నకులుడు=తుచ్ఛులైన. వానిహితుల - తోడబోరియూ। హెచ్చుగాను బక్షులాకు। బచ్చిపోలను -గ్రచ్చరనిడి. వచ్చెదమచ్చుగ॥శెల॥

సహదేవుడు=సీతారామ - చంద్రకవుల - చేత బ్రోచియూ। బ్రీతివేంకయాఖ్యునేలు। సీతాపతి - మనపాలిట, చెన్నుగ గలడిక॥శెల॥

ధర్మ=వచనం॥ తమ్ములారా రారెండు - నావెంట నంటిరండు

పంచపాండవులు=వచనం॥ గురూత్తమా - ధౌమ్యులవారు, వందనంబులు॥

ధౌమ్యుడు=వచనం॥ దీర్ఘాయుష్యమస్తు యుష్మన్మనోభీష్టార్థసిద్ధిరస్తు పాండవులారా, సైంధవుడల్లదే యాజ్ఞసేనిని రథంబుపై నిడికొని చనుచున్నవాడు, మీరలతి రయంబున నేగి, చండకాండంబులచే దెగటార్చి, వానికండలపిండు, పక్షితండంబులకువిందొనర్చి, ద్రౌపదందెండు॥

సంధి చనము॥ అప్పుడ ప్పాండవేయు, లుద్దండకుండలీ మండలేంద్రులచాడ్పున రోజుచు, దిక్తటంబుల దరసింహానాదంబులు సేయుచు, మాంసంబునకుంగవయు డేగలరీతి, జయద్రథసైన్యంబుపై గవసినంతలో

సైంధవుని ॥వచనం॥ ఓమచ్చకంటీ, ఆవచ్చెడు వారలెవ్వరెవ్వరో దెల్పుము, ద్రౌపదీ॥

ద్రౌపది=చ॥ జలగుహా పత్రలో చనుడు, చారుసువర్ణసమాన కాయుడు । జ్వలనవరత్న నిర్మితవి, శౌలరథంబున చండకాండ మం । డలమును బూని చాపగుణ, టంకృతిజేయుచు సింహానాదముం । జెలగ గవచ్చు వాడెన్నృప, శేఖరుడంతకజుండు సైంధవా॥

ఉ॥ ఆతడజాతవైరిశర, ణన్నను గాచును యొట్టిశాత్రవ । వ్రాతమునైన ఘోరర, ణరంగమునందునగాన నమ్మహా। ఖ్యాతిచరిత్రుపూతపదకం, జయుగంబిపు డాశ్రయింపున । న్నీతిదలిర్చనా పనుపు, నెమ్మి నొనర్పుము చాపుదప్పెడిక్॥

సైంధవుడు= వచనం॥ పాంచాలీ, ఈవేద బాపడా, నన్నురక్షించువాడు చాలుచాలు॥

ద్రౌ॥ మ॥ జవనాశ్వంబులబూన్చినట్టి విలస, త్స్వర్ణారదంబందునం।
బవిసంకాశ కఠోరమాగదనుదా, బాహాస్థలిన్ బూనియున్।
రవితేజంబున వారణారిపతిశౌ , ర్యస్ఫూర్తి శోభిల్లనా ।
హావకాంక్షన్ జనుదెంచుయల్లతడెభీ, మాఖ్యుండురా సైంధవా॥

సైంధవుడు-వచనం॥ ఓబాలా, ఉదరంబుకరిగి, మెదలలేకుండావున్నాడే, కాననంబున, నాకులుగూడా, కఱవాయెనాయేమీ॥

ద్రౌ! ఉ॥ గాండీవమాది దివ్యతర, కార్ముకదారుణశాతకాండసత్కాండములన్ధరించియు జగద్గతిగేరెడు శుభ్రవాజులు ।

ద్దండతబూన్చినట్టియర, దంబున భాసిలుచున్న వ
ఖండలనందనుండురిపు, కంఠవిలుంఠనుడోరి సైంధవా॥

కందార్థం॥ శర్వునఖర్వబలంబున। గీర్వాణులుమెచ్చగెల్చి, కీర్త్యా కరుడై। దుర్వారాస్త్రముబడసిన। సర్వాస్త్రసమర్థుపార్థు, సాధించగలావే। యోచించవే। చక్కాగానీవే। వాదాముతేలాను, వారెద మురుమూచు॥ పాదూగబిడుగూలు, బలపినట్టుగనాజి,। నాదరంబొగిలేకమదిన, వ్యాపసవ్యముగాను శరములు। భేదమెన్నకగుప్ప సాగిన భీతిచే వెన్నిచ్చియురుకక ॥సాధించగలవే॥

సైంధవుడు॥ వచనం॥ పీనిక్రోజున, విజయనామంబును తీసివేసెద చూడుమో ద్రుపదపుత్రీ,

ద్రౌపది॥ కందార్థం॥ అరుణాశ్వంబులబూన్చిన। నిరుపమరథములనుయెక్కి నిశితాంబకముల్। విరివిగధరయించియునిదే। పరువడిగను వచ్చుచున్న వారలేకవలూ। పరకరిహారులూ: ప్రాకాటబలులూ, సారాసబాంధావ, సమదివ్యతేజులు. నీరాజనేత్రులు, నిర్మలాగాత్రూలు। వీరిబారినబడ్డనిర్జర, బృందమైనను బోవనేర్చునే। ధారుణీతలమందుమృత్యువు దప్పదకటానీకు సైంధవ ॥వారాలెకవలూ॥

కందార్థం॥ వీరలబారినబడినక। బారావారంబుమధ్య, సక్రాహాతమైె। యూపాడినవయుపోతము। తీరునభపదీయసేన , ధృతిహీనమున నూ। వికలమునగునూ। స్థిరమూగస్థిరనూ। హితవుమీరగనేను యెరిగించుమాటాలు। మఱియందుదలపూము మానాముగోల్పోయి। గతముచెందెదనంచుభయమున, కలహరంగముపిడచి సాటిస్తి। పతులునవ్వగపందచాడ్పున, పాంపోదువునీదుశౌర్యము॥ ధృతిహీనముననూ । వికలము నగునూ॥

సైంధవుడు॥ వచనము॥ ఔలా నీకవల, సనలీల, గెల్చెదచాల్, చాల్నూరకుండుము॥

ద్విపద॥ వారిజేక్షణభవ, ద్వల్లభులమిత ! వీరులైనను మహీభృద్గోష్టియందు । నీమానభంగంబు, నేత్రములగని । తామూరకుం డురే, వలచిచూడంగ । రాచకులు లెమిత, రాచులుగాని । నీచపాం

డవులను, నేనెరుంగుదును। కట్టనుపుట్టముల్ కడుపుకోగిరము ! పెట్ట సొమ్ములులేక భిక్షణాటవిని, కష్టంబు జెందెదు, కౌంతేయులిపుడు। స్పష్టంబుగానన్ను, సాధించగలరె। వాహినీయుక్తుండ, బాహుబలుండ। సాహసంబున సుర, సంఘంబునైన। నవలీల గెల్చెద, నాహవంబునను। జవమున బంపెద, శమనునిపురికి॥

సంధి॥ ఉ॥ అంతట బాండుసూనులుజయద్రథు సేనను కూడ ముట్టియున్। సంతమసంబు దిక్కులను, సాంద్రముగా నొగి గప్పు నట్లు సత్కృంతముఖోగ్రశాతశర, కోటులు కోపహుతాశనాత్ములై గంతులువైచుచుం కరయు, గంబులచే బరగించు చుండగన్॥

దరువు

సైంధవుడు॥ వరయోధులారవిూ, బాహుబలమునుజూప - తరి యిదె వాటిల్లెనూ। విరివిగ పాండు, ధరణీశజులపైనాను। శరపరం పరలురుతరంబుగ - బరపితరసముదురమునను యూ। వరదుపిండుకు నరగ తిండికి నిరవుగను యిడి మరలుడరయగ॥వరయోధులార॥

అదురెద లేకాను - నసి సేయవచ్చిరి మదమూకన్నుల గప్పియూ ముదమున గృష్ణ - హృదయేశులదె ముట్టియూ। కదలనీయక పొదివి మెదడును - చిదిమి నారథకందెనకు బలు। పదిల మొప్పగ గ్రొవ్వు బల్లలు - విదితముగ గొని తెండు లెండు॥ వరయోధులార॥

ఖలమానసులు నాదు - బలమును దెలసియు - విలసితముగ మంటనూ। వెలయగగాంచి - విలయమగుటకు వేగానూ - శలభ ములు వేవచ్చునట్లుగ - జావుకొరకై నేగుదెంచిరి। జలజగర్భుడువీరు నాచే జచ్చుచావ్వున వ్రాసెనుదుటా॥ వరయోధులార॥

ధరసీతిరాజు సీ, తారామచంద్రార్య - వరులాకు శుభమిచ్చియూ మరిజయరామ - సరసుని మదిమెచ్చియూ। గురుతరంబుగ శిరులనొస గియు - కోరె బెల్లముకొండవారి। పురమునందున బరగురాముని చరణముల్ వెసనమ్మి నెమ్మి॥వరయోధులార॥

సంధి॥వచనం॥ ఇట్లు నిజసైన్యంబును బురికొల్పి, జయద్ర థుండు, శంఖంబు పూరించిగవసిన, నప్పాండవసింహంబులు, తమతమ

శంఖంబు లొత్తిన నాకఘోరఘోషంబునకు పర్వతంబులు గదలె, దిశలు చెవుడుబడియె సర్వసర్వంసహా చక్రంబు గంపించె. నాసమయంబున సైంధవానీకంబును దుర్వారపరాక్రమంబున, గెడపి, సింధురాజుండాసి, కనుగొల్కుల మిడుంగురులు సెదర, బొమలుముడిచి శరత్కాలాంబుదార్భటి, పటుపటిమ వాక్యంబుల నిట్లనియె॥

ధర్మరాజు॥ కందార్థము॥ చెల్లెలటంచును దలపక నుల్లంబున నీవు మన్మథోద్రేకము సంధిల్లగొని వచ్చితివిపుడు। యిల్లాలిని దొంగరీతి హెచ్చుగ నేడు - నీరొమ్మున్ వ్రచ్చెదచూడుము చెచ్చెర తూపులు గ్రచ్చర కసిదీర గ్రుచ్చియు మైనిండ జచ్చినట్లుగ జేతు, హెచ్చుగా నేడు॥

సైంధవుని॥ వచనం॥ ఓహో హో ధర్మరాజా, నీకింతపౌరుషంబు గలిగిన, నింతగతియేలవచ్చును బొందిలో ప్రాణముంచిన యెడల నీమహారణ్యంబులందు బలుసాకు దినియయిన బ్రతుకవచ్చును నూరకబాణంబుల కేల బలియయ్యెదవు, అనిబల్కుచు క్రూరనారచం బీరసంబున వేసిన॥ సంవాదము॥ దరువు॥

అర్జునుడు॥ వ్యాళాస్త్రమును వింట నమరా సంధించితి వాలాయముగ వైచెదా దీననూనిన్ను కాలూనిపురికంపెదా॥

మాటలు॥ ఓరి సైంధవాధమా, మందబుద్ధిచే నిందలకోర్చి యీ సుందరీమణినిగొని పోవుచు ధర్మనందను బెక్కులు గూయుచున్నావు యిదే యీనాగబాణంబునకు నీప్రాణవాయువులు మేతగాజేసి, కాలుపురికనుపుచున్నాడ. పందనిలువుము యిదుగో వైచితిని॥

సైంధవుడు॥ విపరాంబకముస నీ విషధరాశుగమును నవలీల న్ద్రిప్పితి వెండియునీపై నపబాణములు గుప్పితి॥

మాటలు॥ ఓరి ఫల్గుణా నీవుప్రయోగించిన నాగాస్త్రంబును గరుడాస్త్రంబుచే మరల్చితి మరియు నీపయి తొమ్మిదిబాణంబులు బరగించితి వీటిచేనీవు శృంగభంగ మయ్యెదవు చూడు మూర్ఖాత్మా॥

నకులుడు = జ్వాలనబాణంబును- సరవిప్రయోగించి, చలమూనుననణ। గించెదా। గాంచుమునాడు, శక్తినిగనుపించెదా॥

వ॥ ఓరిజయద్రధాధమా॥ మాయగ్రజుల, నుద్రగర్వగ్రస్తుం డవై - యత్యుగ్రంబగు బాణంబులు వేసితివిదె, నాతో బోరుము-పావకాం బకము ప్రయోగించితి, దీనభస్మంబయ్యెదవురా-దుర్మతీ॥

సైం=జలధరాస్త్రమున నీ - జ్వాలన బాణంబును, సలలితముగ నొంచితి। నకులుడ నిన్ను-కలహమందున మించితి॥

వ॥ మాద్రేయా నీవు సంధించిన, బంధురవాయు బాంధవ బాణంబు ను మేఘాస్త్రంబున వారించి గెల్చితి, మారుమాటాడక నూరకపొమ్ము బాలకా॥

సహదేవుడు=కరవాలమున నీదు, శిరమూనుఖండించి, దిరముగ యశము నెదా। ద్రౌపదిని, చెఱనుండి విడిపించెదా॥

వ॥ సైంధవా యిదే కరవాలమ్ము చే, నీతలను ఖండించి, ద్రౌపదిని విడిపించి, యశంబుగాంచి వర్ధిల్లుచున్నాను, చూడరా॥

సైం=గురుతర బెల్లము కొండపురంబున, బరగిన శ్రీరాముని సాక్షిగ వేగ, నరయ ఖండన చేసితి॥

వ॥ నీచాత్మా సింధు దేశాధీశునితో బోరబూనితివటరా, నీ ఖడ్గం బును నడుమ దుంచి చండకాండంబులు గుప్పితి, తప్పించుకొనరా సహదేవా॥

సంధి= వచనం॥ ఇవ్విధంబున సైంధవుడు ధర్మజార్జున నకులస హదేవులపై నురువడించి తనసైన్యంబుపై బడి దుర్వారపరాక్రమంబున బేర్చి విజృంభించుచున్న మారుతసూనుపై గవిసిన॥

సంవాదం॥ దరువు॥

భీముడు। ఓరి సైంధవా నాతో - బోరబూనెద వేలా నూరార సతినియ్యరాని యకున్న నిన్ -మారార మొందింతురా కారుణ్యమున దప్ప కావీక్షించితి పారమార్థిక మెంచితీ దుస్సలనెంచి- యూగూఢీ మన్నించితీ నీరసంబున నీకు దురహంకార మిప్పడె మట్టుబెట్టెద నోర మారుతసూ నుడెంతటి శూరుడంచు నుతింప సురలు॥ ఓరి సైంధవ॥

సైం=తిండిపోతా నీకు- భండాన మేటికి వండారపోయి మూలాన జనకున్న నీ- కండాలు ఖండింతురార దండింతునికసుమ్ము దయజూడ నత్యమ్ము నిండెనాయువు నమ్ము మూ చాల్ చాలు ముండాగతిబడియుం

గా జేసిబంపెద-పెద్దవాడనుగనుక నామాటవిని, పట్టుకొ
రు వెళ్ళుచున్నాము

భీముడు-వచనం॥ తమ్ముడా అర్జునా, వాయుదేవుడగ్ని
తోడ్పడినవిధంబుగా, నీవెనాకు బాసట వ్రుతిపి శీలెమ్ము

అర్జునుడు-వచనం॥ అన్నయ్యా భీమసేనాయి వేవెళ్ళదము.

సంధి= వచనం॥ అని యివ్విధంబున, భీమార్జునులు జని, క్రోశమా
బునగూడ ముట్టి - రథ్యంబుల విజయుం గూలనేసిన, తల్లడమందు
విల్లునంబులు విడచి, వెల్లనైన మోముతో, నొడలెల్ల చెమర్చ, నూర్పు
ల సెలంగ, నాసైంధవుడు, తేరుడిగ్గి పారాయనంబైన॥

దర్వు

భీముడు=ఎందుబోయెదవోరి సైంధవ, యింకభీముని ముందరా।
కంధిజొచ్చిన భూమిచక్రము, క్రిందదూరిన నిలువ నిలు నిలు ॥ఎందు॥

మున్నుబల్కినపౌరుషోక్తులు, పన్నుగానెటుబోయెరా
విన్నకన్నెలు నవ్వరానిను, కన్నులాగను గొన్నపురింలో ॥ఎంద
సిగ్గులేకను బారనేటికి, నెగ్గుమాకొనరించితిమా । నుగ్గుజేసియ
శిరముగదచే । మ్రగ్గజేతును పగ్గవినరా ॥యెందు॥

వట్టికొండ వెంకయాఖ్యుని, గట్టిగాపోషించినా । యట్టి రాముని
సాక్షి నిజముగ, మట్టుబెట్టియుగాని జనరా ॥ఎందు॥

సంధివచనము॥ ఇట్లుతన వెన్నంటి వచ్చుచున్న భీముందిరిగి చూచి
యంబునంజని, యొక్కపొదరింటిలో డాగిన, వృకోదరుండాసడిగని
ద్దు పట పట గిటుచు, సైంధవునొడిసి తలపట్టుకొని, పుడమింబడవైచి
చ్చి, మొగంబుబగిలి, రక్తప్రవాహ మానట్లుగా, పిడికిట బొ
బిండికూడుగా, మెదుపు చున్నంతలో॥

నుడు=వచనము॥ ఓ, హూ, హూ, హూ, హూ, భీమసే
బూనవలదు, యింక నేమాత్రింబుగొట్టిన, నీతండు
గాన ధర్మరాజు భాషణంబులం దల

# సైంధవ పరాభవ నాటకము.

కుమిరి లినమాటలాడిన చండమార్గణమండలంబుల మెచ్చు
ప్పుడె-దండధరపురికంపెదనునిను॥ తిండిపోతా॥

భీముడు॥ పుర్రెబుట్టినోనీకీ॥ వెర్రిగుణము లేకా-వొర్రెలెవ్వరుబం
తిరిగింపరా - గొర్రెకోతలుగోసెదా । తుర్రుతుర్రునవచ్చి-
దిగొంపోవా-నర్రూకోతలుగల్గావా । నీచూడనీ- కుర్రాబుద్ధులు
రావా। విర్రవీగగ నేలనిప్పుడు-చుర్రుజుర్రునమండుమువుల్కులు। నోర్రు
సరివేశిబెట్టెద-బొర్రజీల్చియు బొర్రెలోపల ॥ఓరీ సైంధవ॥

సైంధ॥ ధరసీతిరాజుసీ, తారామచంద్రార్య- వరులానుపోషించి
యూ। జెలువొందశ్రీ-కరుజేసి వేంకయ్యాను । పరగబెల్లముకొండ పాలే
మునందున। దిరముగనివసించినా। రాముని యాన, నరయయుద్ధమునం
దూనా। శరపరంపరలతి- రయంబున-గురపినాకర కౌశలంబును । విజివిగా
గుదిమెచ్చినీవే, శరణుజేతునటన్న వినియెద ।తిండిపోతా॥

సంధి॥వచనం॥ఇట్లొండొరులు బెచ్చుపెరిగిన, మచ్చరంబున, కొంత
పుపోరాశి రయంబున, సైంధవుండు ద్రౌపదినివిడచి తేరుదోలుకొ
ప్రాణభయంబున, పారిపోవుటజూచి॥

భీముడు॥ వచనం॥ హేయుధిష్ఠిరమహారాజా, సైంధవుండుపారి
పోవుటజూచితిరా, ద్రౌపదిని రథముపై నెక్కించుకొని, నకులసహదేవ
ధౌమ్యసమేతంబుగా నాశ్రమంబున కేగుడు, అర్జునుండును, నేనునుజని
యాదురాత్ముని భూమిదతారినను, వార్ధిజొచ్చినను, బోనీయక బట్టి మ
ట్టుబెట్టివచ్చెదము॥

ధర్మ-వచనం॥ రణంబున వెన్నిచ్చి పారిపోవువానినిజంపుట, య
శబుగాదు, గానవానినిబట్టి, నాయొద్దకు తీసికొనిరమ్ము, భీమసేనా

భీముడు॥ గీతార్థం॥ చెల్లెలంచును దలపక, నుల్లమందు!
నినిగొంపోవు, నట్టిహీను। బట్టితెమ్మన నేటికి మట్టుబెట్టి। రవ
కా। జాల్చాలు, నెమ్మనుండుము యూరాకా। స
రాజ్యాడనిమెచ్చి। సమ్మానమొనరించి - సాగన
ల్కా॥
వచనం॥ తమ్ముడా భీమసేనా అవహ

